# వసుచరిత్ర - సంగీత సాహిత్యములు

( సాహిత్యోపన్యాసాలు – XI )

(8-7-1973 నాడు హైదరాబాదులో జరిగిన ఉపన్యాసాలు)




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ :: హైదరాబాద్ - 4

# వసుచరిత్ర-నృత్య గీతాది కళావిశేషములు

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

అడుగు వెట్టదు నవ్య హరిచందన లతాంత
సరణిపై గాని యీ యరుణ చరణ-
కేలనంటదు కోరకిత పారిజాత వ
ల్లరిగాని యీ యతిలలిత బాహ-
తనువు జేర్పదు నవోదార మందార మం
జుల శయ్యగాని యీ సురభిళాంగి-
పెదవి జేర్పదు కల్ప వృధివీజఫలసంత
తియెగాని యీమోవి తీపులాడి

గురుకుల క్రమాయాత మీ గిరిజ చల్ల
దనము, జనసైక రూఢమీ తటిని పట్టి
సరస గంభీర భావంబు, సహజ సిద్ధ
మీ నలిన సోదరీమణి మేనితావి.

పై పద్యము మంజువాణిది; వసురాజును-నర్మసఖుడును శ్రోతలు. మంజువాణి పుంవత్ప్రగల్భ మాత్రమేగాదు; పురుషులకన్నను ప్రగల్భ. ఇందులో-గిరికాదేవి సౌందర్య సౌకుమార్యాదులు వర్ణింపఁబడినవి. ఆమెకు నాల్గు 'విశేషణములు;' గిరిక 'యరుణచరణ' 'అతిలలిత బాహ' 'సురభిళాంగి' 'మోవితీపులాడి' ఈ సరకులన్నియు-సాధారణముగా కవిత్వపు బజారులో దొరుకునవే. వీనికి మనమంత ఆశ్చర్యపడవలసిన పనిలేదు ఎట్టిని గనడుగులు గల గిరికాదేవి-హరిచందన వృక్షముయొక్క చిగురుటాకులతో గూడిన దారిమీదనేగాని-యడుగువెట్టదట.! అనఁగా నేమి? ఆమె పాదములు పల్లవ

ములకంటెను—సుకుమారములు; పల్లవనిచిత పదములలోగాని యామె నడువజాలదని యర్థము. "అరుణ చరణా" అనుటచే-నడుగులెర్రని లేజిగురు టాకులవంటి వనియు నొక భావము. చిగురుటాకులకుఁ జిగురుటాకులతోనే పొత్తు గుదిరినది పాపము!

"అతిలలిత బాహా"- యెక్కువ లలితములైన బాహువులు గలది. కనుకనే-యామె, కోరకిత పారిజాత వల్లరినివప్పఁ దక్కన వానినిఁ గేల నంటదు. పారిజాతపుఁ దీగెకంటె-నామె చేతులెక్కువ మృదువైనవి. అందుచే యాతీగలనే గిరిక ముట్టను; "అతిలలిత" యను విశేషణము రెంటికి నన్వయించును ఆమె పారిజాతవల్లరి నెందుకంటును? దానికి సమాధాన మక్కడనే యున్నది. అది కోరకితము; అందుచే "మొగ్గలు గిల్లుట"- కని యుత్తరము. పుష్పాపచయము ప్రబంధనాయికలకొక విలాసము గదా!

"సురభిళాంగి" వాసన లొలుకుచున్న దేహము గలది; అగుటచే సర్వోదార మందార మంజుల శయ్యలందే మేనుసేర్చును. ఆమె శరీరము మందార పుష్పముల కన్నను మృదువైనది. కనుక మందార పుష్పశయ్యనే గాని పరుండదట! "సురభిళ" శబ్దముచే నిచటఁ బుష్పములు సూచితములు. తదనుగుణముగా మందార శబ్దముచేతను వాని పుష్పములే గ్రాహ్యములు; పువ్వులవంటి శరీరమునకుఁ బువ్వులతోడి పొత్తే యుచితమని భావము.

'మోవితీపులాడి' పెదవి యొక్క తియ్యదనము గలది; అది కల్ప వృక్షఫల సంతతినే కాని పెదవి చేర్పదట; అనఁగా ననుభవింపదనుట! రెండు తీపులకు సంసర్గము మంచిదే గదా!

పై పాదములలో దేవతా వృక్షము లైదింటిలో నాల్గు చెప్పఁబడినవి; హరిచందన, పారిజాత, మందార, కల్పములు; సంతాన వృక్షమెందుకో తప్పించికొన్నది. క్రమము దప్పక, పల్లవిత, కోరకిత, పుష్పిత ఫలితత్వములను వచించినాఁడు ఇంత మాత్రమే గాదు చిగుళ్ళకును పాదములకును ఆరుణ్యము సామాన్య ధర్మము. అందుచే 'అరుణచరణ' అన్నాఁడు. వల్లరికిని, బాహువునకును లాలిత్యము సామాన్యధర్మము. కనుకనే 'అతిలలిత బాహ' యనుట. మందార శరీరములకు, సౌరభ్యము సామాన్య మగుటచే

'సురభిళాంగి' యైనది; కల్పఫలములకును, మోవికిని, సామాన్య ధర్మముగాఁ దీపిని గైకొన్నాఁడు. ఇవి సాభిప్రాయములైన విశేషణములు. గిరిక చల్లదనము అనగా సౌమ్యభావము. గురుకుల క్రమాగతమట! గొప్పవంశము నుండి వచ్చినది. తండ్రి తాతలనాటి యాస్తియని తాత్పర్యము. హిమవంతుడు శీతనగము గదా! ఈ 'తటిని పట్టికి' సరసత్వ గాంభీర్యములు పుట్టుకతోడనే వచ్చినవి. 'జలమయత్వములో' నని యర్థాంతరము. గిరిక మేనితావి 'సహజ' సిద్ధము; అనగా స్వభావసిద్ధము సహజము లనఁగాఁ దోడబుట్టినవి. పద్మములు; వాని నుండి యేర్పడినదనియు నొకయర్థము. పద్మినీ జాతుల దేహయష్టి నుండి పద్మగంధపు తావులు ఘుమ్మురనునట! గిరికది పద్మినీజాతి యని సూచించుచున్నాడు. ఈ నాల్గు పాదములందును, సమృద్ధి మద్వర్ణన యున్నది గనుక, యుదాత్తాలంకారము.

పై వానిలో దేవ వృక్షములనే యెంచుటామె యాభిజాత్యమునకు గుర్తు. పల్లవములడుగులు; కోరకములు రోమాంచములు; వల్లరి శరీరము; మందార పుష్పములలోని, సౌకుమార్య సౌగంధ్యము లామె గాత్రమున కున్నవి. 'మోవితీపు' కల్ప వృక్షఫలముల తీపివంటిది. గిరికపెదవి యెఱ్ఱనిది; కల్పవృక్షఫలములు కోరి కొన్న రంగులో నుండును అవి గూడఁ దత్కల్పములే. ఇవన్నియును పర్యాయరి సౌందర్యములు; ఈ యందములు, సాదృశ్యమునఁ బర్యవసించుచున్నవి. ఈ పద్యములోని విశేషణములు సాభిప్రాయములగుటచేఁ బరికరాంకురాలంకారము. చాలని దానికి "లతాంత" మనగాఁ "జిగురు టాకు" అనుటకు గొంత వ్యుత్పత్తిగావలెను.

పై పద్యములో నింతవిశేషమున్నది. ఇట్టిదే యీ క్రిందిపద్యము.

"మోహోపదేశతమో విముద్రితములైన
        కనుపమ్ములు హిమాంబు లునువరాదు
శ్రమ బిందు తారకాగమభిన్న కుచకోక
        ములఁ జంద్రనామంబు దలఁపరాదు
శీర్యద్దాశాప్పంత శిథిలి తాసులతాంత
        మసియాడ పీవనల్ విసరరాదు

పటుతాప పుటపాక పరిహీనతను హేమ
మింక పల్లవ పుటా ర్చిడగరాదు

లలన శానంగకీలి కీలాకలాప
సంతతాలీఢ హృదయ ప్రాంతరాళ
పూరిత స్నేహపూరంబు పొంగిపొరల
చల్లని పటీర సలిలంబు చల్లరాదు

—గిరికాదేవి మూర్ఛపోయినది. ఆమెకుఁ జెలికత్తె లుపచారములు సేయు చున్నారట! మన కిట్టి మూర్ఛలు దెలియవు లెండు. ఇది ప్రబంధనాయికల గొడవ. మనము చదివి లొట్టలు వేయవలసినవి. అంతే, ప్రణయ మూర్ఛలు వచ్చినప్పుడు సాధారణముగా—ప్రబంధనాయికల కేమి సేతురు? మొగముపై బన్నీరు చల్లుదురు ; కుచమండలమునఁ గర్పూరము రాతురు; విసనకర్రలతో విసరుదురు. చిగురుటాకులే పాన్పుగాఁ బఱచి—పవ్వళింపఁ జేతురు.

ఇంకను మత్తు దిగకున్నచో—శరీరమంతయుఁ జందనపు నీరు జిలుకరింతురు. ఇది ప్రణయమూర్ఛకు వైద్యము. గిరికాదేవి కీయుపచార ములు సేయరాదనుచున్నారు 'డయాగ్నైజు' చేసిన కొందరు చెలికత్తెలు. ఎందుకు? వారి కారణములివి మోహమనెడు చీకటి ముసరుకొన్నది. మోహము నల్లగా నుండునని కవి సమయము. ఆమె కనుదమ్ములు ముకు ళించినవి. పద్మములపైఁ బడిన మంచునీరు దానిని నాశమొనర్చును. దీనినే కాళిదాసిట్లన్నాడు.

అథవా మృదువస్తు హింసితుం
మృదునైవారభతే ప్రజాంతకః
హిమసేకవిపత్తి రత్రమే
నళినీ పూర్వ నిదర్శనా మతా॥

—హిమాంబువులను మాట శ్లిష్టము. పన్నీరు-మంచునీరని రెండర్థములు; శాబ్దికమంతయు—నాభాస మాత్రమే గదా! ఈ ప్రశ్నకాతఁడు బదులు చెప్పడు. స్వేదబిందువులను నక్షత్రములతోఁ బోల్చుటయు — కుచములను

గోకములతో బోల్చుటయుఁ గవి ప్రస్థాన ప్రసిద్ధములే. క్రమబిందు తారకాగమముతోనే కుచచక్రములు భిన్నములైనవి; ఇఁక చంద్రోదయమైనచో గతియేమి? చంద్రశబ్దమునకు కర్పూర చంద్రుఁడర్థము;[1] అసులతాంతము—ఆశావృంతము నంటుకొని యున్నది. అయాశావృంతము అసియాడుచున్నది. ఆ పూలెప్పుడు పడునో! అందుచే వీవనలు విసరరాదట! శరీరమనెడుబంగారు—తాపమనెడు పుటపాకముతో నిప్పటికే గరిగిపోయినది మరల పల్లవపుటార్చిలో బెట్టినచో వస్తువే మిగుల కుండఁబోవును గదా! బంగారముపుటమువెట్టినపుడు వన్నె హెచ్చుకొలఁదిని తూనిక తగ్గుచుండునట; 'పల్లవపుట + అర్చి' —అనియు పల్లవపుటార్చి యనియు రెండు పద విభాగములు. పోనీ! శరీరముపై జందనపు నీరు జల్లుదమా! యని కొందరు జెలలన్నారు. అనుభజ్ఞులైన చెలులు దానిని గూడ దృణీకరించిరి. కారణము హృదయమనెడు పాత్రలో స్నేహమనెడు స్నేహపూరము సలసల మఱుగుచున్నది. దానిపై బటీరసలిలము జల్లినచో! కాలుచున్న నూనెపై నీరు జిలుకరించిన నేమగును? నూనె పొంగి పొరలును. ఇట్టి పద్యమర్థమగుటకు—కవి సమయములు దెలియవలెను. ప్రస్థాన ప్రసిద్ధములైన యుపమానోపమానము లెఱుఁగవలెను. కళాదుని మర్మమును కసికట్టి యుండవలెను. "పుటము" వెట్టుట వైద్యశాస్త్రపు సరకు; ఇంత విషయ సమావేశమీ రచనలో నున్నది; ఇంకను ఊహించుకొలఁదియు వాసనలు గుబాళించుచుండును. ప్రబంధకవుల రచనామార్గమిట్టిది. వారు సాహిత్యవీరులు. పురాణకవులు కథ చెప్పికొనుచుబోదురు. అవసరమైనంత వరకే యుపస్కారకముల వాసన. ప్రబంధకవులట్లు గాదు. వారికి కథ, యముఖ్యము; రచనలో లోకకావ్య మర్యాదలనన్నిటిని జూపింపవలెనను నాశ. అభినివేశము ప్రబంధములలో నిండుగా వస్తువు లేదే యనువాడు మల్లెతోటలో మిరియాలడుగు వెంగలి, అంతే. ఒక్కొక్క ప్రబంధకవికి గొన్నిఁటిపైఁబక్షపాత ముండును. పరిచయముండును ఆ కావ్యము జదివినపుడా కవి తన సర్వశక్తులతోఁ బ్రత్యక్షమగును.

---

1. ఆశాబంధః కుసుమ సదృశం ప్రాయశోహ్యంగనానాం।
సద్యః పాతిప్రణయి హృదయం విప్రయోగేరుణాద్ధి
(మేఘసందేశము — కాళిదాసు)

మనుచరిత్రే జదువుచున్నామను కొనుఁడు. అందులో నమాత్యు లకుఁగల సంగీత పరిచయము మనకగుపించును. "నిధి శాస్త్రము" తెలిసిన వాడనుకొందుము. ఆయుర్వేదమున బ్రవేశముండెనేమో యనిపించును. సంస్కృతములోని వైష్ణవ సాహిత్యము గమనించి యుండునేమో యని తోచును.[1] కన్నడ సాహిత్యముతోఁ బరిచయముండి యుండునని యూహింతుము. గిరడీలు, కసరత్తులు, మల్ల యుద్ధములు మొదలైనవి గమనించిన వాడనిపించును. తానొక మండలాధీశ్వరుఁడగుటచే రాయలవారి వెంటనప్పు డప్పుడు వేటలకును వెళ్ళియుండును. ఆ వాసన నిండుగా చతుర్థాశ్వాసములో గనుపించుచునే యున్నది. వ్యాకరణ శాస్త్రముతోడి పరిచయముండనే యున్నది. లేకున్న ప్రౌఢప్రయోగప్రసిద్ధి యేర్పడదు. ఇట్లే కొందరి కావ్య ములు చదువుచున్నప్పుడు వారికి వేనివేనిలోఁ బ్రవేశమున్నదో మనకు స్పష్ట ముగ నగుపించుచుండును. తెనాలి రామకృష్ణుని గమనించి నప్పుడు అతఁడు తార్కికుఁడై యుండునని యూహింతుము. తక్కిన శాస్త్రములలోఁ బాండి త్యములేదనికాదు; ఇదియాతని ఖురశీరంగమని, అట్లే సూరన్నగారి నధ్య యనము చేయుచున్నప్పుడు మీమాంసా శాస్త్రమర్యాదలక్కడక్కడ గను పించును. ఈ దృష్టితో రామరాజభూషణుని జదివినచో నాతనికిఁగొన్నిటి యందుఁదీవ్రమైన యభినివేశము, కొన్నిటితోడి పరిచయమున్నట్లు సులభ ముగా గ్రహింపవచ్చును. ముఖ్యముగా నాతనికి సంగీతములోఁ గాఢమైన యభినివేశమున్నది, అధికారమున్నది. అతఁడే తన్నుగూర్చి 'సంగీత కళా రహస్య నిధి' యని చెప్పికొన్నాఁడు. అతనికాశ్రయ మిచ్చిన "రామరాయలు" నానాకళాపారీణుఁడు మంచి వైణికుఁడు గూడనట! "స్వరమేళ కళానిధి"ని రచించిన రామయామాత్యుఁడు వీరిర్వురి సమకాలికుఁడు. ఆ గ్రంథమున

---

1. రవి బింబపతన దీర్ఘ పయోధిగర్భనిర్గత శేషఫణిఫణారత్న రుచియో!
(మను 3-77)

చాళదినేశ బింబద నెఱల్ జలదోళ నెలసిత్తో, మేణ్, ఫణిం
ద్రాలయదిందముర్చిదఫణా మణిమంగళ రశ్మియో!
(పంపభారతము 1-98)

భట్టుమూర్తి చేయికొంత యున్నదేమో! నరసభూపాలీయమును రచించినది భట్టుమూర్తియే. మరి యాగ్రంథములో నెచ్చటను సంగీత వాసన లేదేమి? ఇది యొక ప్రశ్నయే. ఆ రచనా కాలము నాటికి, ఆతనికావిద్యలో నెక్కుడు పాండిత్య మబ్బియుండలేదేమో? తానప్పటికి సంగీత విద్యార్థిగానే యుండి యుండవచ్చును. వసుచరిత్ర రచన వేళకు సాహిత్యమునకు సంగీతము విశంకటముగాఁ దోడైనది. సంగీత సాహిత్య పరిష్కృతమైన ప్రత్యేక ధారాశుద్ధి యేర్పడినది. "ధారాశుద్ధి" యనగా మనలో నొక భావమున్నది; యతిప్రాసములలోఁ కుంటు పడక తీగె దిగిచినట్లు సాగించు పద్ధతిని సాధారణముగా ధారాశుద్ధి యందుము. ఈ దృష్టితోఁ దిక్కన గారిలో ధారాశుద్ధి కలదు. కాని, యిది సంగీతమునకుఁ బనికివచ్చునదిగాదు. నన్నయ్య గారిలో ధారాశుద్ధి యున్నది. వారిరచనలోఁ గూడ సంగీతపు జోడింపు దక్కువ; నన్నయ్య గారిదీ పద్యము—

సీ॥ చనుదెంచి యమ్మహా జనపతి జలముపై
  జూంచి యచ్చో విశ్రమించి చూచి
తత్కాలమున విలసత్కాల ఘనవల్లి
  యన్నిష్ట సఖ నూడియున్నదాని
గురుకుచ యుగముపైఁ బరువడి దొరగెడు
  కన్నీరు పూరించుచున్నదాని
తన సమీపమునకు జనులరాగమనంబు
  పన్నుగా గోరుచు నున్నదాని

—పై దానిలో ధారయమరినదని యంగీకరింతుము. కాని—యది తాళానుగుణమైనదిగాదు. మొదటజూపిన వసుచరిత్రలోని సీసపద్యములు రెండింటియందును సలము లెక్కువ. అనగా నైదు మాత్రలలో నడచునవి. దీనిని సంగీత పరిభాషలో 'ఖండగతి' యందురు. మొదటిపద్యమందు మూడుపాదములును సగముతోనే యారంభమగుచున్నవి. అట్లే రెండవ పద్యము నందలి నాలుగవ పాదమున వరుసగా సలములే వచ్చినవి. ఐదైదు మాత్రలు చొప్పున మనము భాగించుకొని తాళము వేసినచో వాని పాదములు జంపె, రూపక, త్రిపుట తాళములలో దేనికైననుసరిపోవునా యనిపించును.

ఇట్టి పద్యములు వసుచరిత్రలోఁ గొన్ని పదులకుఁ జూపవచ్చును. ఒకే జాతికిఁ జెందిన గణములతోఁబాటు నడుమ నడుమ ప్రాసలు గూడ చేరినపుడు సంగీత మున కెంతయో యొద్దికగా నుండును. ఒక్క సీసపాదము లందు మాత్రమే గాదు. ఇతర ఛందస్సు లందు కూడ నిట్టి వక్కడక్కడ గనుపించును. ఈ క్రింది వట్టివి.

......మహికాంత! నిరంతర చింతనింతవిం
తనెగులు పోవనేల?... ... ... (వసు 3. ఆ. 87 వప)

" ... ... ... ... ... ...
ఏల యీ బాల యీ వేళ యీ విశాల
యవనికాభ్యంతరంబున కరిగెననఁగ (వసు-8 ఆ. 69 వ)

"వచ్చుగాకేమి యీ వసుమహిపాలు బా
లామనోభవుని నేలా తలంచె (వసు. 3 ఆ. 116 వ ప)

—పై వానిలో సాహిత్యప్రౌఢియే కాదు. సంగీత వాసనయుఁ గలదు. వానిని స్వరములలోనికి మార్చినపుడు యీ యందమర్థమగును. మరి కొన్ని విశేషములు జూపింతును. మను చరిత్రలోని యీ క్రింది పద్యమును గమ నింపుఁడు:—

క॥ మృగమద సౌరభవిభవ
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితే తర పరిమళమై
మగువ వొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్॥

—పై పద్య మందలి నాలుగవ చరణమును మృదంగ పరిభాషలోనికి మార్చి నపుడు "తకిట తకిట తకిట దీంత తాకిట తకతోం" అని కావచ్చును. సంగీత పరిజ్ఞానములేని వారికైనను-పై పాదమును జదివినప్పుడు యేదో సాహితీ మార్గభిన్నమైన యొక చమత్కారమున్నదనిపించుటలో నాశ్చర్యములేదు. వసుచరిత్రలో నీ ఛాయకుఁ జెందినదే పద్య మొకటి.

క॥ ఉద్ధతరిపు విద్ధతపన
పద్ధతి కరిభవన దవని పట దంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స
మిద్ధరణ రజో వ్రజోద్య దిభమ దస్పృతికిన్॥

పై పద్యము నంతయు మృదంగ సాంకేతిక ధ్వనుల క్రింద మార్చ వచ్చును అట్లైనచో నేపద్యమును మార్చరాదు! కొందరు పద్యములను పాటలుగా బాడుట నేను విన్నాను; మరి కొందరు వాల్మీకి "మార్గ సంగీత మునకుఁ బ్రాణమువోయునట్లు రామాయణశ్లోకములను దాళమున కవక తవకగాఁ గుదించి పాడుదురు. అట్లే యే పద్యమునైన తాళమునకు యేదో యొక రీతి కుదింప వచ్చును గదా! చేయవచ్చును. కాని వచ్చిన కష్టమంతయు దానిని రక్తి కట్టించుటలోనే యున్నది. పై పద్యములో "సం పద్ధరణ, సముద్ధరణ, సమిద్ధరణ" అనుచోట మాత్రమే పుష్టిగా మృదంగ పరిభాష యున్నదనుచున్నాను. "తద్ధీ త్తకిట, తద్ధీ త్తకిట, తద్ధీ, త్తకిట" యని మూడుసార్లు పలుకుచున్నది. దీనికే ముక్తాయింపు అందురు. అది కడ పటనే రావలెను గదా! ఇది కేవలము సంగీత విషయము; ఎక్కడనో యొక చోట వచ్చినది దానిని జూచి మనమానంద పడవలెను అంతే.

సీ॥ వలుద గుబ్బలు ప్రసేవకవృత్తి దగు గుబ్బ
కాయల కపరంజి చాయలొసఁగ
లలితాంగుళీదళంబులు సమేళములైన
సారలపై రాగ సంపదలిడ
పాణికంకణ రుతుల్ ప్రాణాను బంధమ్ము
గలతాళగతి కనుగ్రహము లీన
నాలాప భంగి యత్వ్యక్త సంవాది స
మ స్వరంబులకు గ్రామంబులునుప
తే॥ బ్రచర తానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతన రీతిఁదనరఁ
జేతనంబు లచేతన భాతి నొనర
వీణ వాయించు నొక యలివేణిగంటి॥

పై పద్యమందలి ప్రథమపాదము లోని మెలుగులు సాహిత్యమునకు సంబంధించినవి. రెండవది సారెలను సవరించుట దెల్పుచున్నది; తక్కిన పద్యమంతయు సంగీత నిఘంటువు. పాణికంకణరుతులు-తాళగతి కనుగ్రహము సేయుచున్నవట! ప్రాణానుబంధ మనుమాట తాళమునకు సంబంధించినది. అఖండమైన కాలమును ఖండములుగాఁ జేసి ఆ ముక్కలను హెచ్చుతక్కువలులేకుండ నికరముగా నేర్పఱచి జోడించుటకే తాళమని పేరు. ఈ తాళములు మొదట నూట యెనిమిది. రాను రానైదు వందలకు పైఁగానైనవి. చిట్టాలు కట్టుటలో గొప్పవారైన ప్రాచీనులు భేదము కాని భేదములతో యెన్నో కొత్త తాళముల నేర్పఱచిరి. రఘునాథ నాయకుఁడు రామానంద తాళమని యొక్క దానిని వింగడించెను వీనిలో మరల 'మార్గదేశి' భేదములు. మార్గసంప్రదాయమునకుఁ జెందిన తాళము లైదు. ఈ తాళముల కుపాస్య దేవతలు, వాని యుపాసనాక్రమము, వీనిలోని రహస్యములుఁ చాలాకాలమివి విద్వాంసుల జయాపజయములకుఁ గారణములై యుండెడివి. ఛందస్సులో మాత్రలను మూఁడుగా, నాల్గుగా, ఐదుగా, యేడుగా వింగడించి గణములను గూర్చుకొందుము; వీనికి త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్రములని సంగీత లాక్షణికులు చేసికొన్న సంకేతము తొమ్మిది మాత్రలతో గూడ నొక గణమును వారేర్పఱచుకొన్నారు. దానికి "సంకీర్ణ" మని పేరు. కాని యది గాయకులకే రుచింపక వదలిపెట్టిరి. కాగా కొంత కాలమునకుఁ దాళములలో విప్లవము బయలు దేరినది. పాటలన్నిటికిని ఆధారమైనది గతి; దానిని చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండములు నాలుగే విధములని చాటి చెప్పిరి. ధ్రువ, మధ్య, రూపక, ఝంపె, త్రిపుట, అట, ఏక తాళములలో నీగతులన్నియు నణఁగియున్నవని యుద్ఘాటించిరి; వీనికి క్రొత్తదైన ఆదితాళ మొకటి చేరినది; ఏడు తాళములును, జాతిభేదములతో ముప్పది యైదుగా నైనవి. వీనికే "సూడా" ది తాళము లని పేరు. ఈ తాళము లన్నియు నొక్క పాటలో నణఁగి యుండునట్లు గొన్ని రచనలు ప్రాచీను లొనర్చినారు. సామాన్యులకు సులభముగా ప్రధాన తాళముల యొక్క యీ జ్ఞానమును గల్పించుటకై వీని రచనము. కాని యవి రక్తికి రాలేదు; తాళములకుఁ బ్రాణము లున్నవి. అవి పది. వీనికే దశప్రాణము లని పేరు. గ్రహములు ప్రధానముగా రెండు రీతులు. సమగ్రహము

విషమ గ్రహము. సమగ్రహమనగా పాటయును, తాళమును ఒకే సారి యారంభించుట. త్యాగరాజుగారి హరికాంభోజి రాగములోని 'వినతాసుత' యను కృతి దీనికుదాహరణముగా జూపవచ్చును. తాళమును గాని, పాటను గాని, మొదట నారంభించి రెండవ దానిని తరువాత మొదలు పెట్టుట విషమ గ్రహము. ఇది రెండు విధములు. అతీత గ్రహము, అనాగతగ్రహము అనాగతగ్రహమనగా దాళమారంభించిన పిమ్మట గొంత విశ్రాంతితోఁబాటను మొదలు పెట్టుట; దీనిని చోటు విడుచుట యందురు. ఒక అక్షర కాలము గాని రెండుగాని, మూడుగాని వదలి, యెత్తుకొనుట సామాన్యముగా నాచారము. అతీత గ్రహమునఁగాఁ పాటను తాళము కంటె ముందారంభించుట. త్యాగరాజుగారి "వినాయకుని వలెను బ్రోవవే" అను మధ్యమావతి, యాది తాళములోని కృతి ఇందుకుదాహరణముగా వచ్చును. త్యాగరాజుని అను చోట 'త్యా' అనునది ముందటి తాళము యొక్క 'ఉసి' తోఁ జేరిపోవును. "గరాజు" తో తాళము యొక్క ఆవర్తమారంభ మగును. వీని యన్నిటికినిఁ దమిళములో "ఎడుప్పు" అని యందురు. పాటలోఁగూడ గ్రహస్వరములున్నవి. అవి పండితుల పాండిత్య విశేషమును దెలుపును. 'వేయురాగ మేమో" యని వినువారిని మభ్యపెట్టును శంకరాభరణ రాగ మున్నదనుకొందుము. దాని నొకడాలాపించు చున్నాఁడు అది ధీర శంకరాభరణ జన్యము. చతుశ్రుతి, రిషభ, అంతర గాంధార, శుద్ధమధ్యమ, చతుశ్రుతి ధైవత, కాకలీనిషాదములు దాని స్వరసంచారములు; రిషభమును షడ్జముగా జేసికొని-మొదటి శంకరాభరణములోని రాగ స్వరములనే పాడినపుడు అది "ఖరహర ప్రియ" గా మారును. గాంధారమును షడ్జముగాఁ జేసికొనిపాడిన "తోడి" యగును. ఇట్లు ఒక్కొక్క రాగములో నేదేని యొక్క స్వరమును షడ్జమును జేసికొని మొదటి రాగస్వరములనే పాడిన వేరు రాగమని భ్రాంతి కలుగను. ఇటు పాడునపుడు గ్రహభేదముచే వచ్చిన రాగమును బ్రస్తరించు చున్నను మొదటి రాగమును మరువకపాడవలెను. ఇది పండితులసామర్థ్యము. ప్రస్తుతము మనకుఁ గావలసినవి, తాళమునకు సంబంధించిన గ్రహవిశేషములే. ఇఁక రాగాలాపన విషయము. స్వరములు నాల్గురీతులు. వాది సంవాది వివాదియనువాదులు. ఒక రాగ సంచారమునందు వాది రాజువలె స్వేచ్ఛా విహారము చేయును. సంవాది దాని కమాత్యుఁడగును. వివాది శత్రు

స్వరము. రాజు వెడలి నప్పుడంతయు రౌతు వెడలి తీరును గదా! అందుచే ననువాద స్వరము వాది వెంటనే యుండును. ఇఁక సమస్వరమనఁగా నేమి? వదలిపెట్టఁదగనిదన్నమాట అనఁగా మిత్రస్వరము. ఈ పద్ధతి ననుసరించియే గ్రామములుండును. గ్రామమనఁగా స్వరసమూహము; వానిరాకపోకలు; వీనిలో నంతర్భాగములే మూర్ఛనలు; గ్రామములు మూఁడు రీతులు-షడ్జ గ్రామము, మధ్యమ గ్రామము, గాంధార గ్రామము గాంధార గ్రామము మానవలోకములో లేదన్న మాట. షడ్జ, మధ్యమ గ్రామసంచారములు మాత్రమే యున్నవి సప్త స్వరముల యొక్క ఆరోహణ-అవరోహణమునకు మూర్ఛన అని పేరు. అట్టి మూర్ఛన లేడుచేరి-యొక గ్రామము. గ్రామ మొక్కటికేడేసి మూర్ఛనల చొప్పున పదునాలుగు మూర్ఛనలున్నవి ఇక తానము, ఇది మధ్యమ కాలములో నడచును రాగములో దీనిని ప్రధా నాంగమని చెప్పవచ్చును. దీనికి ముందంతయు నాలాపనం చౌక కాలములో నడచుట పరిపాటి. అందుచే మధ్యమ కాలములో నడచు తాన సంచారము వచ్చినంతనే మన శరీరములో ప్రాణ స్పందనము కలుగును ఇందులో రాగ ముస కంగముగాఁ గొంత తాళముగూడ నడచును. ఎక్కడైనను "న్యాస" మొనర్చినపుడు దాని చుట్టును కొంత మంద సంచారములుసాఁగును. తానము నందు "తానమ్త" "తానన్న" "తానమ్న" యీ పదములు వాడవలెనని నియమము. తాళా వర్తములు పూర్తిగాకున్నను అక్కడక్కడ వానిసంచార ములు గనిపించును. గతిభేదములతో నెన్నోతాళ విశేషములు గూడఁజూపు దురు. ఇవన్నియు ముఖ్యముగ వీణలోఁ జూపుకైవాడములు; విద్వాంసులు వీణలపై త్రికాల తానములను గూడ వాయింతురు. ద్రుత కాల తాళము నకు "ఘన" మని పేరు. ఈతానము లెనిమిది విధములు. గజతానము అశ్వ తానము-మయూరతానము-కుక్కుటతానము-మండూకతానముమొదలైనవి. వాని పేరులే తద్గతి విశేషములను దెల్పుచున్నవిగదా? ఇట్లుమధ్యకాలములో తాళసాహాయ్యముచే నడచునది తానము. అందుకే యచేతనములు- చేతములైన వనుచున్నాఁడు. మూర్ఛనలు మందసంచారములు గలవి. వానిలోఁ జేతన ము లచేతనములైనవి. కనులు మూసికొని నిశ్చలముగా హాయిగా విందమని పించునని భావము.

గీ॥ గంధగజయాన గీత ప్రబంధ కలన
నలరి యతితీయమై వచ్చు నరిది, మగువ
లార! కనుగొంటిరే! యను నాళివాక్య
మొకటి వినసైన నిదెవేళ మొగవెననుచు॥

ఇందులోని "ప్రబంధ" శబ్దము "మాతువు" నకు సంబంధించినది. గీతికా సామాన్య నామము. ప్రబంధభేదములు బోలెడు. 'యతి' శబ్దము— సంగీత సంబంధి. తాళదశ ప్రాణములలో నిదియొకటి. ఒక రీతిగాఁజూచినచో దాళమునందు వచ్చు నంగముల యొక్క క్రమ విన్యాసమునకే 'యతి' యని పేరు. అది యాఱు రీతులు. సమ, గోపుచ్ఛ స్రోతోవహములు. డమరు మృదంగ విషమములు. సమజాతులైన యంగములే వచ్చుటకు "సమయతి" యనిపేరు. "స రి గ రి-గ మ ప మ" మొదలైనవి. అంగములయొక్కవిలువ మొదలు చాల అక్షర కాలముల విలువగా నుండి క్రమముగా దగ్గుచువచ్చినచో గోపుచ్ఛయతి—

స ని ద ప మ
ని ద ప మ
ద ప మ
ప మ
మ

— దీని స్వరూప
మును సాహిత్యములోఁ జూపినచో కనుకూలముగ నుండుననుకొందును.

| | |
|---|---|
| త్యాగరాజయోగవైభవం | అగ. (ఉపి) |
| అగరాజయోగవైభవం | దె. పా |
| రాజయోగవైభవం | గ (మొదలు) |
| యోగవైభవం | (ఇ ఇ) |
| వైభవం | |
| భవం | |
| వం | |

ఇట్టిదే మరి యొకటి.

సా ర స ప దే
ర స ప దే
స ప దే
ప దే

స్రోతోవహా యతి యనఁగా- మొదట సన్నముగా నుండి రానురాను వెడల్పై కడకు వచ్చుసరికి ఎక్కువ విస్తీర్ణము గలది.

రి స
మ రి స
ప మ రి స
ద ప మ రి స
ని ద ప మ రి స
స ని ద ప మ రి స

సాహిత్యము నిట్టి దొకటి.

శం
ప్రకాశం
స్వరూప ప్రకాశం
త త్వ స్వ రూ ప ప్ర కా శం
స క ల త త్వ స్వ రూ ప ప్ర కా శం
శివ శ క్త్యాది స క ల త త్వ స్వ రూ ప ప్ర కా శం॥

ఇట్లే డమరు యతి మొదలగునవి.

మ॥ పద మెత్తం గలహంసలీల-యధరస్పందంబు సేయన్ శుభా
స్పదమౌ రాగ కదంబకంబు-శ్రుతి జూపన్ శ్రీవిలాసంబు, శే
ల్లగదలింపన్ సుకుమారపల్లవ నవైలాలక్ష్మి, పీఠింప వ
ట్పదియుంబోల్పు, వరంబె కన్నెగొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్॥

పద మెత్తిన తోడనే కలహంసలీలయట! కలహంస- యని యొక రాగమున్నది. ఒక గీతికా భేదము గూడగలదు. పెదవి గదలించినచో- రాగ

మాలికలు బయలుదేరును శ్రుతిజూపినచో - శ్రీరాగవిలాసము కన్పించును. శ్రీరాగము చాల ప్రాచీనమైనది. ఘన రాగములలో నొకటి. చేయిచాచినచో సుకుమారములైన పల్లవములు-చరణముల గల యేల పాటలు దోచును. నేను జూచినంతవరకు అన్నమయ్యగారి యేలపద మొక్కటి దొరికినది. షట్పది గూడ ప్రబంధ నిర్మాణములో నొకటి. ఇవన్నియు సంగీతశాస్త్రములోని విశేషములే.

నాదంబొక్కటి పిక్కటిల్లె దిశల న్నవ్యామృతా వ్యాహతా
స్వాదంబై వినవయ్యెడిం బ్రియవయస్యా! వింటివే! షట్పదీ
నాదంబో! కలకంఠనాదమొ! మరున్నారీమణీ వల్లకీ
నాదంబో! వివరింపరాక పరమానందాను సంధానమై॥

పై పద్యమును జదువుచున్నప్పుడు విక్రమోర్వశీయములోని—

మత్తానాం కుసుమరసేన షట్పదానాం
శబ్దోయం పరభృత నాద ఏషధీరః
ఆకాశే సురగణ సేవితా సమంతాత్
కింనార్యః కలమధురాక్షరం ప్రగీతాః॥

అను శ్లోకము జ్ఞాపకము వచ్చును. రామరాజభూషణుని పద్యము దానికి ప్రతిబింబమగునేమో! ఇట్టివే మరికొన్ని సంగీతవిశేషములు వసుచరిత్ర యందు బరికించు కొలదియు దొరకునని నా యూహ. కొన్ని యింతకు ముందు నా "వసుచరిత్ర సాహితీ సౌరభము" నందు వివరించినాను. మరల నిచ్చటవానిని దడవుట చర్విత చర్వణమగును. నా కసమ్మతముగూడ. వసుచరిత్రకు జక్కని వ్యాఖ్యానము వ్రాయవలెనను కుతూహలము గలదు. డా॥ బెజవాడగోపాల రెడ్డిగారు సహృదయ శిరోమణి, రసికులు, రామానుజరావుగా రన్నివిధముల సమర్థులు. వారి యౌదార్యము నీరి పట్టుదల నాతో నీ పనినిఁ జేయించు నేమో తెలియదు.

# వసుచరిత్ర కవితా విపంచి

శ్రీ యస్. రాజన్న కవి

నదీమతల్లులకు నారీత్వమును ప్రసాదించి "రసోదంచిత చమత్క్రియా కల్పనాకల్ప భవ్యమ్ముగా" వసుచరిత్ర మహాప్రబంధమును సృష్టించి సరిగమల మధురిమలు చిలికించిన కవి మూర్ధన్యుడు రామరాజ భూషణుడు.

ప్రబంధ కవులందరు సమకూర్చిన అలంకారములన్నియు ఒకఎత్తు! తన సంగీతశాస్త్ర పరిష్కృతమైన ధారాశుద్ధితో నిర్వక్ర ప్రౌఢితో వాగ్వైచిత్రితో "జీవన మెల్ల సత్కవి నిషేవితము, విశ్వధాత్రీ వలయ త్రికాల ఫల దేశికము, ముక్తావళీ విభ్రమాస్పదము, అయిన 'కవితా విపంచిని' మీటి "అచేతనమ్ములు చేతన రీతి దనర, చేతనమ్ము లచేతనభాతి నొనర' అపూర్వ కవితా శిల్పముతో భూషణుడు సంతరించిన సౌందర్య శోభ ఒక యెత్తు!!

రామరాజ భూషణుడు [1]సంగీత కళారహస్య నిధి. పద్య రచనా సామ్రాజ్య పట్టాభిషిక్తుడు. అంతేకాదు బహు విషయ విజ్ఞాత. సంస్కృతాంధ్ర సకల భాషా సామ్రాజ్య సర్వంకషమైన పరిశ్రమ చేసి ఈ మహాకవి సంపాదించిన శక్తులు అనన్య సామాన్యము.

సంగీత పాండిత్యములు ఇంత సమానముగ కడుపార త్రావి పెరిగిన కవికిశోరము ప్రబంధ యుగములో మరొకరు అగుపించరు. సంగీత సాహిత్యములు శారదాదేవి స్తన ద్వయముగా ఉపవర్ణించి అలఘు ప్రస్తారములుచేసి (1-8) తన సంగీత స్వకళా ప్రావీణ్యమును ప్రకటించు కొన్నాడు. ఆయన కవిత చదువగానే మొదలు శ్రవణానందము కలిగి, పిదప తేనెసోనట్లు

---

1 గీతము = పాట: సంగీతము = జంత్రగాత్ర నృత్యసమ్మేళనము.

రుచిచూపి, తర్వాత హృదయకుహరములో ప్రవేశించి మనస్సునకు అవ్యక్తమైన ఆనందము అందించునట. (2–14) నిజముగా ఆ మహాకవి కవితాధార సంగీత సుధాధార!!

వసంతకాలము వచ్చినది. మూర్తి కవి రాగమాలికలో సంగీత 'కచ్చేరీ' ప్రారంభించినాడు.

"లలనా జనాపాంగ వలనావసదవంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ
మలసానిలవిలోల దళసానవరసాల
ఫలసాదర శుకాల పన విశాల
మలినీ గరుద నీక మలినీ, కృతధునీ క
మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతను కాంత
మకృత కామోద కురవకా వికల వకుల
ముకుల సకల వసాంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరమ్ము" (1-116)

సంగీత జ్ఞానము ఉన్నవారు, లేనివారు కూడ పై పద్యము చదువుచున్నప్పుడు మనస్సులు పరవశించి, శిరస్సుల నూపవలసినదే! పాఠకునకు హృదయముండవలెనంతే! పై పద్యము ఆపాత మధురము, ఆలోచనామృతము. భట్టుమూర్తిని సంగీత విద్వాంసుడుగా చెప్పుటకు ఈ పద్యము చాలును. మరియు

"ఆ లావణ్యవతీమణుల్ కొలువగా, నాలేమ యా కోనలో
నాలీలా భవనమ్ములో, ననఘ కంఠాలాప్తి సౌభాగ్యముల్
వ్యాలోలాంగుళి సంజ్ఞచేఁ గఱపు తేవన్ వీణఁ బల్కించు, నా
యాలాపంబె గిరిదరీ ముఖరమై యాలింపగా నయ్యెడిన్"

అల్లే నాళీకాకరతీరసార కదళీ నారంగ పూగావళీ (2-29) వంటి పద్యములలో కవి రాగం-తానం-పల్లవి వీణలో పల్కించి, సర్వేంద్రియ మోహనమై, నియతికృత, నియమరహిత, హ్లాదసుధాభాజనమైన ఆనంద తత్త్వమును ప్రసాదించినాడు. "కంతాల ప్తి" "తేవన్ వీణ బల్కించు" శబ్దములు మృదంగ వరుసలలోని ముక్తాయింపు ధ్వనులను అలపించుచున్నవి.

"తత నితంబా భోగ ధవళాంశుకములోని
యంగ దట్టపుఁగావి రంగు వలన
శశికాంత మణిపీఠి జాజు వారఁగ గాయ
లుత్తంగ కుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీ ధూత తంత్రీ స్వనంబుతో
జిలిబిలి పాట ముద్దులు నటింప,
నాలాప గతిఁజొక్క యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్య విభ్రమము దెలుఁప
బ్రౌఢిఁ బలికింప గీత ప్రబంధములకుఁ
గ్రమ కరపంకరుహ రత్నకటక ఝుణఝు
ణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలువ
నింపు దళుకొత్త వీణవాయించు చుండె" (మ. 2-27)

పై పద్యమున వరూధిని "ఇంపుతళు కొత్త వీణవాయించి" తన ఆలాపనకు తానే పరవశించిన తన్మయ హృదయ. గిరిక అట్లుకాదు. తన వీణా వాదనతో ఎదుటి వారిని కూడ రంజింప జేయు సర్వకళా స్వరూపిణి. ఆమె వీణవాయించుటే కాదు- పల్కించును కూడ!

మను చరిత్రలో పెద్దన్నగారు కూడ వరూధినీ గృహమును వర్ణించుచోట

"తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొను కాంతారమ్ము నంద్రైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిల ద్రాక్షా గుళుచ్ఛంబులన్
బూవుందీవెలనొప్పు నొక్క భవనమ్మున్ గారుడోత్కీర్ణమున్.

అనుపద్యములో "ముఖారి"రాగచ్ఛాయలతో "తానం"మాత్ర మేపల్కించెను.

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల దాయన్ లేక, రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి, యొత్తి, యా
రాజీవానన యేడ్చెఁ గిన్నర వధూ రాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచి కారవ సుధాపూరంబు లోరంబుగన్ (4-52)

కాంభోజీ రాగము మార్దవదైన్య భావములను ప్రకటించును. ఈ రాగభావమును పై పద్యములో చక్కగా వ్యక్తము చేసినాడు. ఇందులో రాజశ్రీ సఖమైన మోము, రాజీవానన శబ్దవిశేషములు పరస్పర విరుద్ధములు. ఇచ్ఛోట రస్య ఆజీవః రాజీవః అనుగ్రహముతో రాజీవశబ్దమును సమర్థించిఅర్థ పుష్టిచేకూర్చినాడు. ఈ పద్యమున మాటిమాటికి అంబుజ శబ్దము వాడి అటు చంద్రుని, ఇటుగిరికను గోడుగోడున ఏడ్పించి వినోదించినాడు కవి.

భట్టుమూర్తి ధారాశుద్ధి సంగీతశాస్త్ర పరిష్కృతమైన దని ముందే మనవి చేసినాను కేవలము పదముల మధ్య విశ్లేషము లేకుండ చెప్పుటయే పెద్ద నాదుల ధారాశుద్ధి. మను చరిత్రలోని ఈ పద్యము వినండి!

"వాలారుంగొన గోళ్ళ నీ వలసతన్ వాయించుచో, నాట కుం
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీవంటమి జేసి, యా
యాలాపంబె యవేళఁ బల్కెడు, ప్రభాతాయాత వాతాహతా
లోల తంత్రుల మేళవింపగదవే! లోలాక్షి! దేశాక్షికిన్॥ (మ. 3-57)

నాట రాగము పగలు మూడవ జామున, దేశాక్షి ప్రాతఃకాలమున పాడదగిన వని భావము. ఇందులో ఒక్కొక్క రాగమునకు ఒక్కొక్క శ్రుతి చేసి వాయించుట మనకు అర్థమగును. కాని ఆయా రాగములకు అను కూలముగ స్వర ప్రస్థానములు సమకూర్చి వాయించుట సహజ స్థితికాదు. ఈ పద్యమున వరూథిని సాయం సమయమున నాటరాగమునకు వీణపై సర్వ ప్రస్థానములు మెట్ల సహాయమున సవరించి పెట్టి వాయించినది. అంత విరహ తాపమును భరించలేక వెళ్ళిపోయినది. ఇంతలో తెల్లవారినది. ఉదయము ప్రభాతమారుతము ఆ వీణా తంత్రులకు సోకుటచేత నాటరాగమే "అవేళ"

పలుకుచున్నట్లు చెప్పబడినది. అట్లైన ఒక రాగమునకు నిర్ణయించిన స్వర శ్రుతులు మెట్ల సహాయమున వీణపై సవరించి, ఆ తర్వాత 'పవన' తో విసరి నప్పుడు కూడ ఆ రాగము ధ్వనించ వలె కదా! కాని అట్లు ధ్వనించదు. పెద్దనగారి ఈ భావము కల్పనా జనితమైన చమత్కారమే కాని, సంగీత శాస్త్ర సమ్మతము కాదు, అనుభవ సిద్ధమును కాదు.

మూర్తికవి సంగీత రచనలో అట్టి సందేహములకు అవకాశము లేదు. ఇతడు సంగీత శాస్త్రమును ఆపోశనము పట్టిన వాగ్గేయకారుడు.

"అరిగా పంచమ మేవగించి నవలాలవ్వేళ[1] హిందోళవై
ఖరిఁబూనన్ బికజాత మాత్మరవ భంగ వ్యాకులంబై, వనీ
ధర నాలంబిత పల్లవవ్రత విధుల్ దాల్పన్, తదీయ ధ్వనిన్
సరిగా గైకొనిడెన్[2] వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్॥ (1-10)

వసంత రాగము ప్రాతః కాలమున ప్రథమ యామమున పాడ దగినది. భట్టుమూర్తి కాలము నాటికి ఇది సంపూర్ణ రాగము. నేడు వాడుక లోనున్న వసంతరాగమునకు "పంచమ" స్వరములేదు. "స్యాద్వసంతోఽల్పంచమ" అను సూక్తి సంగీత శాస్త్రములో చెప్పబడినది. అంటే "వసంతకు" అల్పపంచమ సంచారమున్న దన్న మాటేకదా! ఈ "టెక్నిక్" పద్యములో ఎంత చక్కగా ఇమిడ్చినాడో రసజ్ఞులు గ్రహించవలె. పద్యము లోని పల్లవ శబ్దమును పల్ + లవము అని విడదీసిన లవమైన "ప" కారము ధ్వనించును. "తపర స్తత్కాలస్య" సూత్రము వలన హ్రస్వపంచమము మాత్రమే మిగులును. ఈ రహస్యము ముందు ముందు పద్యములలో మృదు షడ్జము, మృదు పంచమము (2-17) అను ప్రయోగము వలన బట్టబయ

---

1. "శిశిరస్య వసంతస్య సంధౌహిందోళ రాగకః

2. వసంత: స గ మ ధ ని స——స ని ధ మ గ రి స
హిందోళ: స గ మ ధ ని స—— స ని ధ మ గ స
(హిందోళ నుండి వసంత ఆవిర్భవించింది)

లైనది. "పత్ + లవము" అనగా పాదలేశము, లేదా పాదాగ్రము. దీనిని బట్టి కోయిలలు వసంతకాలము వచ్చినంతవరకు తోటన వ్రేలిమీద నిల్చి తపస్సు చేసినట్లు భావించవచ్చును.

"అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును, నాతిమాత్రతా
రక పరివర్తనంబు, శుభరాగ మిళత్పద పల్లవాంకము
ద్రికయును, తెంపుమీర నిజదృష్టులఁ బోలిన సింధుకన్యకా
ప్రకట వివాహగీతికలు పాడిరి పుణ్య పురంధ్రి కాముకుల్"
(5—71)



పుణ్య పురంధ్రికాముకులు సింధు కన్యకా ప్రకట వివాహ గీతికలు [1]సైంధవి రాగములో పాడుటలో ఔచిత్యమున్నది. (సింధుకన్యక = సైంధవి = లక్ష్మి) ఈ రాగమునకు తారస్థాయిలో సంచారములేదు. 'ని' లయస్ఫూర్తితోనే ఆగిపోవును. దీనికి తారక "ప-రి" వర్తనములేదు. అంటే తారస్థాయిలో పంచమ-రిషభ సంచారము లేదు. [2]"సౌమ్యమాన" అనుచోట శుద్ధమధ్యమమే కాని, ప్రతి మధ్యమము లేదని మొత్తము సైంధవి రాగలక్షణమును చెప్పినాడు. వివాహగీతిక అనుచోట "క" ప్రత్యయము అల్పార్థములో వాడి, సైంధవి రాగము జన్యరాగమని కూడ సూచించు చున్నాడు



ఇందులో ఇంకొక విశేషమున్నది. "అకుటిల సౌమ్యమాన" అను సమాసము వాడినాడు. లక్ష్మికి తమ్ముడు సోముడు. ఇతనికి లయమున్నది. (అమావాస్య) వక్రతము కలదు. అంటే కుటిల స్వరూపుడు (లక్ష్మి సోమ సంబంధి భ్రాతృత్వము కలది) ఆ భ్రాతృక మైన కన్యను వివాహమాడుట ప్రశస్తము కాదు. ఇది ధర్మశాస్త్రనిర్ణయము. గిరిక తమ్ముడు వసుపదుడు.



---

1. సైంధవి = ని ధ ని స రి గ మ ప ద ని-ప ప మ గ రి స ని ధ ని స (ఖరహర ప్రియ జన్యరాగము)

2. సౌమ్య + మ + అన = శుద్ధ మధ్యమ స్వరము ప్రాణముగా గలది సైంధవి.

అతడు అకుటిలమైన వంశములో జన్మించెను. సౌమ్య స్వభావము కలవాడు. కావున గిరిక లక్ష్మికంటె ఉత్తమురాలు. లక్ష్మి నీచ గామిని కూడ, గిరిక "మాననిలయ".

చందన గంధులు (1-105), పగడపు జిట్టులన్ (1-114), ఒక కాయ నవపాయ (2-7), వైణిక వల్లకి శ్రేణి (5-68). మొదలగు పద్యములలో-గాన ప్రభావమున చేతనము లచేతనములగుట, జగదభివంద్యమైన గాన రస సంగతిచేత కన్నుల నుండి ఆనంద బాష్పములు రాలుట; సకలజంత్ర గాత్ర వాద్యముల బృందగాన మాధుర్యమును-మనోజ్ఞముగ వర్ణించినాడు.

షష్ఠ్యంతములలోని

ఉద్ధతరిపు విద్ధతపన
పద్ధతి కరి భవన దవని పటదంబుధి సం
వర్ధరణ సముద్ధరణ స
మిద్ధరణ - రణోగ్రవణోద్యదిభ మద సృతికిన్ (1-89)

ఈ పద్యమున

తద్ధి తకిట, తద్ధితఝణు
తద్ధిరుతకు, తకిట దికిట తకతోంకిట, తాం
కుత్తఝణు, కకుంతఝణు, కు
కూంత దిరు, తతోంత కూంత తకుత దిగిణతోం.

అను మృదంగ "తత్కార" వాద్య ధ్వని ఎంత మనోహరముగ "ఆదితాళ" లయ ప్రధానముగ వ్యక్తము చేసెనో సహృదయైక వేద్యము.

శబ్దాలంకార రచనా కౌశలము భూషణకవికి సహజభూషణము. ఈ క్రింది పద్యములలో కవితాభావ గాంభీర్య లోపము గాని, వ్యర్థ పదము గాని కన్పించదు.

"ఒక కాయ నవపాయ (2-7), ఇమ్మైనై మరుహారమ్మైనై (1-141), ఈరాల బోరాదు (2-58), ఆలరు ప్రాయము వాని (3-46),

పరమానవ (3-118) -ఇట్టి అను ప్రాసాద్యంత నియమములు గల పద్యములు వసుచరిత్రలో కోకొల్లలు. అవసరమైనప్పుడు దీర్ఘసమాసములు వాడినప్పటికి అందులో శ్రవణ సుభగత్వ ముండును. శబ్దములు అర్థము కాకపోయినను తంత్రీనాదము వలె పాఠకునకు హాయి కలిగించును. పై పద్యములు భావానుగుణ్యమైన రాగములను జోడించి, స్వర సంచారము చేసి, స్వరరాగ సుధారసమును పంచిపెట్ట వచ్చును.

వసుచరిత్ర చమత్కారముల పుట్ట. గిరికా వసురాజులకు వివాహమైనది. లక్ష్మీనారాయణుల వలె, రతీమన్మథుల వలె ప్రకాశించుచున్న వారి దాంపత్యసుఖమును కవి దివ్యదృష్టితో చూచి వర్ణించెను.

"సతి సాహిత్య రహస్య మీశువలనన్ సాధించి, తోడ్తోనద
త్పతికిన్ బ్రత్యుపదేశమిచ్చె-నతుల ప్రౌఢిన్, ధ్వని వ్యక్తిఁ ద
చ్ఛ్రుతికిన్ జొన్పుచు, లోచనాంజన రస ప్రోన్మేషము ల్నమ్మిళో
ద్గతము ల్సేయుచుఁ బ్రత్యలంకరణ మౌఖర్యమ్ము దీపింపగన్. (6-94)

గిరికా వసురాజులకు పార్వతీ పరమేశ్వరులకు అభేద ప్రతిపత్తి పాదుకొల్పి, శ్లేషసహాయమున నాయికానాయకులకు ఒక పవిత్రత కల్పించినాడు కవి. అంతేకాదు; వసుచరిత్ర రచనలోని తన పాండిత్య ప్రతిభా విశేషములకు చక్కని నిర్వచనము పై పద్యము ద్వారా దృష్టాంతీకరించెను.

పరమేశ్వర కారుణ్య కటాక్ష లబ్ధమైన సాహిత్య రహస్యములను సాధించి, శాస్త్రప్రవచనములు నిర్వహించు సామర్థ్యమును పొంది, ధ్వని మర్యాదను పాటించి, అలంకార ఆడంబరమును గ్రహించి-కేవలము "లోచనము" తో కాక "అంజనము" వేసి చూడగల్గిన "అతుల ప్రౌఢు" లకు తప్ప తదన్యులకు-శుష్కతర్క బుద్ధులకు వసుచరిత్ర అర్థము కాదని జొమ్మువిరిచి చెప్పుకున్నాడు.

ఇందులో మరొక పరమ రహస్యమును ప్రామాణికముగ విన్నవించెను. "ధ్వని-లోచనము" అను రెండు పదములు తన ప్రతిభకు మారుగా వాడినాడు. ధ్వన్యాలోకము అలంకార శాస్త్రము. దీనికర్త ఆనందవర్ధ

నుడు. ఈ శాస్త్రమునకు అభినవగుప్తుడు "లోచన" మను వాఖ్యానమును రచించెను. భూషణకవి కూడ నరసభూపాలీయమును వ్రాసిన లాక్షణికుడు. ఇన్ని విషములు పై పద్యములో గుప్తము చేసినాడు.

గిరిక విరహబాధ అనుభవించుచున్నది. చెలికత్తెలు మన్మథ పూజ చేయుచున్నారు. ఆ మన్మథ పూజా వర్ణనలోని శబ్దసౌందర్యము అపూర్వము. ధ్యానము, ఆవాహనము, అర్ఘ్యపాద్యము, అభిషేకము, పుష్పోపహారము, చందన చర్చ, ధూపదీప నైవేద్యములు- ఈషోడశోపచారములు మన్మథునికి అవసరము లేదట. ఎందుచేత? ఆ మన్మథుడు హృదయ వాస్తవ్యకుటుంబి, జగద్వ్యాపకుడు, నారాయణప్రియసూతి - మొదలైన విశేషశక్తి సంపన్నుడు గనుక. అందుకై "మధురస ఫలోపహారమును" భక్తితో సమర్పించి "మానమథనాయ, "మదనాయ, మధుసఖాయ, మనసిజాయనమో! నమో!"అనుచు, మ్రొక్కిరి. ఒకే అక్షరమును మాటి మాటికి ఉచ్చరించు మంత్ర సంప్రదాయము నెరిగిన కవి కావున "మ" కారములల్లే పల్కించెను. అల్లె "కామ! కమలాస్త్ర! కమలాకాముక సుత! కామకనీయక నిధీ!" అంటూ ప్రార్థన సాగించెను.

మొదటి పద్యములో "మ" లక్ష్మీబీజము. రెండవ పద్యములో "క" విష్ణుబీజము. కాముడు లక్ష్మీనారాయణుల ప్రియపుత్రుడు కదా! అసలు గిరికకు కావలసినది కళ్యాణము. అందుకే "మ" కారజపముచేయించెను. పరిణత వాక్కు గల భూషణకవి ఇట్టి సంప్రదాయ శబ్ద శ్లిష్టత ప్రతి పద్యములోను చెప్పక చెప్పినాడు.

పంచమాశ్వాసమున ఇంద్రుడు సృష్టించిన మహా నగరములో కురంగములు తురంగములుగా (5-43) మారుట అరదములు శరదములుగా (5-44) నగుట వాఖ్యలోనిదే!

"గిరివర ఘోర కందరల కేవల వన్య గతైక వృత్తిచే
దరలక యున్న సత్కృతము తప్పునే! అప్పురి కేసరుల్ నృకే
సరులయి, పూర్ణ పౌరుష విశాలత, మించె మహోన్న కేసరిం
పరునకు మార్గోన్నగంబిడమి, భక్తుని ప్రోవ సటల్లటింపమిన్.
(5-45)

ఇక్కడ కేసరులు నృకేసరులైనవట. ఈ జన్మ ఎట్లు సిద్ధించినది? వన్యగశైక వృత్తి వలన సిద్ధించినదట. (వనీ + అగజ) పార్వతిని సేవించుట వలన ఉత్తర జన్మ ప్రాప్తించినది. పార్వతి వాహనము సింహమేకదా! ఇది సహజ స్థితి. ఆ సంస్కృతము చేత సంపూర్ణ పురుషత్వము వచ్చినది. పూర్ణ పౌరుష విశాలతతో నృసింహస్వామిని మించి పోయినవట. ఇట్టి భట్టుమూర్తి సార్థక పదప్రయోగ ప్రాగల్భ్యము అనితర సాధ్యము. అతడు చిత్రవిగ్రహ విశంకటుడు గదా!

"కమలాభర్త భవద్విరోధిపై చక్రంబున్ ప్రయోగింప (4-81) అను పద్యములో రాహువు చంద్రుని మ్రింగబోవుట, చక్రధారణ ప్రధాన విషయములు. ఇక్కడ విరోధి శబ్దము సాభిప్రాయముగ వాడినాడు. (వి = ఆకాశము; రోధి = అడ్డగించువాడు) రాహువు ఆకాశమార్గమున చంద్రుని అడ్డగించువాడు కదా! అట్లే "చంద్రదినేంద్ర విరోధి" అని మరొక చోట వాడినాడు.

వసురాజు తన కేళిశైలమైన కోలాహల పర్వతముపైన పుష్పోద్యానవనములో తిరుగుచుండెను. ఇంతలో ఒకమధుర సంగీతమువినవచ్చినది.

"నానా గాయన గాయనీ మణుల గానంబుర్వి నాలింపమో
నానాటన్ నగభేది పీటగల గంధర్వాప్సరోగీత వి
ద్యా నైపుణ్యము లెన్నియేని వినమో! యందైన, నిందైన నిం
దై నాదంబొన గూర్చునే మదికి నిట్లానంద సందోహమున్. (2-18)

అట్టి అవ్యక్త మధురమైన అపూర్వమైన గానము విన్నాడు. వసురాజు ఆజ్ఞ మేరకు నర్మసచివుడు వెళ్ళి

"తరువుల పొంతపొంచి వసుధావర మిత్రుడు గాంచె నచ్చటన్
దరుణిం, దమోవినీలకచం దామర సోదర సోదర ప్రభన్
దరళ విలోచనన్ తతనితంబం దటిన్నిభగాత్ర వల్లరిన్
దరుణ శశాంక ఫాల, నొక తన్విం, దరంగ వళిం, దలోదరిన్.
(2-2?)

ఇందు 'త' కార శబ్దమును వరుసగా వాడి మాధురీ ధుర్యమైన కలస్వనముతో కర్ణరసాయనము గావించెను. 'త' కారము విశేషముగా వాడుటలోని ప్రత్యేకత వ్యాఖ్యాతలు తడవలేదు. 1 "తన్వి శబ్దమునకు త్ + అను + యస్యాఃసా – తన్వీ అని చిత్ర విగ్రహము. తకారమును అనుసరించిన విశేషణములు కలది తన్వీ అయినది. అందుచేత "త" ఆ తన్వి వెంట అంటి వచ్చినది.

భట్టుమూర్తి ప్రతిశబ్దమును అప్సరసవలె నాట్యము చేయించగల దిట్ట. ఆశబ్దముపై చమత్కార చిత్రములను చూపుటలో అందెవేసిన చేయి.

గిరిక వీణ వాయించు చున్నది. విదూషకుడు ఆమెను చూచివచ్చి

"స్వైర విహార ధీరలగు సారసలోచనలున్న చోటికిన్
జేరున లాతివారు చొరబూనినచో రసభంగ మంచునేఁ
జేరక పువ్వుఁదీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారగఁ జూచి వచ్చితి–నవాంబు రుహాంబక! నీకుదెల్పగన్"

(2—56)

అని విన్నవించినాడు. ఈ పద్యములోని ప్రతిశబ్దము తన గర్భములో బ్రహ్మాండమైన అర్థగాంభీర్యమును నింపుకొన్నది. సారసలోచనలు రసభంగముచేత సాలోచనలగుట. వ్యాఖ్యలోనిదే! నవాంబురుహాంబక శబ్దమును త్రిమూర్తులకు మన్మథునికి అన్వయించి ఇప్పటికి ఎందరో చెప్పియున్నారు.

'రూపు' శబ్దముపైన ఒక లక్షణామూలకమైన వ్యంగ్యము నిర్వచింప వచ్చును. బొడ్డులేని డాలరుగల సువర్ణహారమునకు "రూపు" అని పేరు. దీనిని కన్య రజస్వల అయిన తొమ్మిదవ రోజున మెడలో వేయుదురు. డాలరుపైన సరస్వతీ విగ్రహముండును. వివాహ సమయమున ఈ 'రూపు' ఆభరణము తీసి తాళికట్టింతురు. రాయలకాలములో ప్రత్యేకించి పెను

1. శ్రీ నరాల రామారెడ్డి శతావధాని వ్యాఖ్యానము

గొండ ప్రాంతములోని సంప్రదాయమిది. 'పుష్పవతివియ' అని చమత్కరించి గిరిక సర్వాలంకార భూషిత అని సూచించు చున్నాడు. కవి శబ్దశక్తి వలన సాధించిన అర్థచమత్కారములు అనంతములు. మూర్తికవి 'సార-సలోచనుడు కూడ!' అంటే రస దృష్టి కలవాడని భావము. ఈ విషయము 'సారంగ' శబ్దమున మరుగుపరచి, "సారంగచ్ఛతీతి సారంగః" అని వింగడించి తన్నుతాను సమర్థించుకొన్నాడు. నిజముగ రామరాజభూషణుడు సాహిత్యరంగమున స్వైర విహారధీరుడే!! అనగా స్వతంత్ర భావనా పరికల్పిత ధీరతా గుణుడని స్ఫురింప జేయుచున్నాడు

నర్మసఖుడు 'మునివేషమున' గిరికను సమీపించెను ఇష్టసఖి మంజువాణితో సంభాషణ ప్రారంభించినాడు.

"అనుపమ భాగ్యలక్షణ సమన్విత యీరమణీలలామ! యీ
మనసిజ రాజరాజ్యరమ మానసవీధి తలంప సింధు నం
దన యచలేంద్ర నందన యనం గన నయ్యెడి! నీలతాంగి పా
వనకుల గోత్ర భూతి-చెలువా! చెలువారగఁదెల్పవే" యనన్
(2—97

కులగోత్రము లేడింటిలో హిమవత్పర్వత మొకటి. హిమవంతుని కుమారుడే కోలాహలుడు. అతని 'కులగోత్రభూతి' గిరిక! ఈ పద్యమున గిరికను, 'లతాంగి' గా చిత్రించినాడు. ఇక్కడేమిటి? గిరిక జ్ఞప్తికి వచ్చిన ప్రతి సమయములోను 'లతాంగి' శబ్దమునే ప్రయోగించినాడు.

గిరిక లతవంటి శరీరము కలది. ఆమె కన్య. కన్య సహజముగ కృశాంగియేకదా! అంతేకాదు గిరిక అటు పర్వతమునకును ఇటు నదికి జన్మించినది కనుక-వనసంబంధమైన 'లతాంగి' శబ్దమును ఔచిత్యమెరిగి పలుతావుల గుర్తుచేసినాడు. 'లతాంగి' ఒక ప్రతిమధ్య రాగము కూడ!

వసుచరిత్ర కారుడు 'జగత్ప్రాణనందన కారుణ్య కటాక్షము' పొందిన అదృష్టవంతుడు. కనుక ఇందులోని వంచనాయతి పాత్రను రామా

యణము నందలి హనుమంతుని భిక్షుక వేషమునకు ప్రతిబింబముగా చెప్పినట్లు మనమూహించవచ్చును.

ఈ కావ్యమున పౌర్వాపర్యవిరోధము గాలించి వెతకిననూ కన్పించదు. ఉదాహరణకు ఒక్కటి మాత్రమే మనవి చేయుదును.

గిరికా వసురాజుల ప్రథమదర్శనము జరిగినది. పరస్పరము చూచుకొన్నారు. వారి అప్పటి యౌవనోద్రిక్త భావవాహిని గట్లు త్రెంచుకొని పొంగి పొరలినది ఇంతలో తల్లి పిలువఁబంచినది. అటుభావజుడు, ఇటు భావజ రూపుడు వసురాజు—గిరిక కాళ్లకు బంధము వేసినారు. సిగ్గుతో వెళ్లి పోవుటకు ప్రయత్నించినది గిరిక—అప్పుడు.

"నెనరున చేయిపట్టి - తరుణీ! ధరణీ సరణీ పురంధ రుం
డనుపక పోవుటెట్లు? తగవా! నగవారఁడి వెట్టనంచు - జ
వ్వనిఁ జెలువెల్ల నిల్పి - 'మహివల్లభ! మా చెలిమీది ప్రేమ నీ
మనమునఁబాయకుండు మని' "మానినిఁ" ...

(8—74)

గేలిసేయుచు తోడ్కొని పోయినారు. కోపము మూర్తీభ వించిన ఆ గిరికా రూపమే వసురాజు మనస్సులో నిల్చిపోయినది.

"అనగరాజ భేదియును నానగరాని మనోరథంబుతో
"మానిని" నాత్మనిల్పి, ధృతిమాని, నిరంతర బాష్పవారిఁగ
న్గోనల నాని, మానికవు గోనలలో, నెల మావి కానలో
నానన విల్తుదేవ, నలినానన యేగిన జాడ నేగుచున్"

(8—79)

ఆ 'మానినీ' విరహాతురుడై రాజధానికి మరలిపోయినాడు. ఇంతలో మంజువాణి రంగమున ప్రవేశించినది. వసురాజుకు గిరికామౌక్తిక హారమును అందించినది. ఆ విరహవేదన ద్విగుణీకృత మైనది.

"కమనీయ ద్యుతి ధామమా! విమల ముక్తాదామమా! సేమమా!
కమలామోదకుఁ, దత్సఖీసమితికిం గల్యాణమా! తన్మరా
ళ మయూరీ శుకశాబ శారికల కెల్లన్ భద్రమా! తెల్పుమా!
ప్రమదా రత్నము పేరుగా నెద నినుం భావించి ప్రార్థించెదన్"
(4—100)

మొదలుగా గల పద్యముల ద్వారా హృదయ విదారకముగా విల పించినాడు. ఈ సన్నివేశమున కవి తన్ను తాను మరచి రసభావ స్రోతస్సులను ప్రవహింపజేసినాడు. 'నిజమైన ప్రేమ, ఆత్మసౌందర్యము వియోగ కాలమున హృదయ మథనము వలన వ్యక్తము కాగలదని' నిరూపించినాడు. ఆ పద్యములు చదువుచున్నప్పుడు ఎంతటి కఠిన హృదయములైనా ద్రవింప గలవు.

మూర్తికవి సాహిత్యములో పరకాయ ప్రవేశ విద్యారహస్యము నేర్చిన మాంత్రికుడు. ఈ కవి కోడిరూపములో సాక్షాత్కరించి తనశక్తి సామర్థ్యములు ఎట్లు ప్రకటించుచున్నాడో రసికులు గమనింతురుగాక.

"ఒక వాడింద్రునియంత వేలుపు మదయోక్తిన్ విడంబించి, తా
నొక కాలంబెరింగింపవచ్చి, మునిశాపోద్వృత్తి పాలయ్యె, మా
మక శబ్దంబది యల్పమే! [1] త్రిముని సంభావ్య [2] త్రికాలీ విలో
లకమన్ రీతి - [3] త్రిభంగిగా మొఱసె జెంతన్ తామ్రచూడౌఘముల్.
(4—128)

---

1. త్రిమునులు ; సూత్రకారుడు పాణిని, భాష్యకారుడు పతంజలి, వాక్యకారుడు వరరుచి.
2. త్రికాలి : భూత భవిష్యద్వర్తమాన కాలములు.
3. త్రిభంగి : వస్తు, నేతృ, రసాశ్రయములు.

తన్ను అనుసరించుట మహాకవీంద్రులకు సైతము సాధ్యముకాదు; తనశబ్దశక్తి అమోఘమైనది; తన కావ్యము పాణిని, పతంజలి, వరరుచి - శాస్త్రకారుల అమోద యోగ్య మైనది. అంతమాత్రమేకాదు — వసుచరిత్ర భూత భవిష్యద్వర్తమాన కాలములకు పనికివచ్చు గ్రంథము అని "భాలెంత" చేసి తన పాండిత్య ప్రతిభా విశేషములను ఎలుగెత్తి చాటినాడు.

వసుచరిత్రలోని పద్యములు సంప్రదాయముగ చదివినప్పుడు ఆ సంక్షిప్తత (Brivity) అర్థమగును. ఈ కావ్యములో సంస్కారము కంటె పాండిత్యము కొన్నిపాళ్లు Dominate చేసినది (మించిపోయినది).

"అతులశైవలవతీ (2-122), సుమనోధివాస భాసుర (2-108), వేణిచలింప, సరసదరీ ఝరి (2-95)," మొదలైన పద్యములు కవి శ్లేష పాండిత్యమునకు, వర్ణనావైశద్యమునకు, వ్యంగ్యధోరణికి ఉదాహరణములు! పై పద్యములలో వాడిన "గోత్రతిలక-మహానగము — ధరాధీశుడు" వంటి పదములు పద్యభామినికి తిలకముల వంటివి.

మనుచరిత్రలో మనోరమా వివాహ సమయమున చెప్పిన పద్యమిది

"అప్పుడు తూర్యముల్ మొరయ నమ్మిథునమ్ము విలోకనస్పృహం
దెప్పలఁ దేలవంపఁబడు తెల్లనిచీర తెరం గ్రహింపునన్
గొప్పు మొగంబున బ్జుఁజను గొండలుఁదోప లతాంగి పోలెఁజె
ల్వొప్పతిలన్ సుధారసపయోనిధి పెందరఁబుట్టు నిందిరన్
(మ. 5—80)

ఇది ప్రాచీన పూర్ణోపమ. ఇందులో క్రొత్తదనము లేని మూర్తి కవి పెదవి విరచినాడు. వెంటనే

ప్రణయమును ముక్తకంఠముతో గానముచేసి అజరామరుడైన అదృష్టి వంతుడు రామరాజ భూషణుడు.

సాహిత్య రసపోషణ, సర్వంకషప్రౌఢి, గానవిద్యావిశారదత్వము, కథాశిల్పరహస్య వేతృత్వము మూర్తీభవించిన కవితామూర్తి భట్టుమూర్తి! అతని అక్షయమైన, అక్షరమయమైన సాహితీశక్తులు అనన్య లభ్యములు. వసుచరిత్ర వంటి అపూర్వచమత్కార కథా సంవిధాన మహనీయమగు విలక్షణ ప్రబంధము ఆంధ్రసారస్వతములో మరొకటిలేదు.